# అజంతా సుందరి

( గేయ నాటికలు )

పి. నారాయణరెడ్డి.

ప్రకాశకులు :

అరుణశ్రీ గ్రంథమాల

1370/1, జనరల్ బజారు, సికింద్రాబాదు.

# అభినందనలు

తెలంగాణంలో చిరకాలంనుండి వుంటూవచ్చిన సాహితీ వాఙ్మయాన్ని ప్రోద్బలడానికి నేడు అనేక సంస్థలు పనిచేస్తున్నాయి. ఈ సత్సంకల్పంతోనే జననమొందిన సాహిత్యసంస్థమా "అరుణశ్రీ గ్రంథమాల" తెలంగాణంలోని ప్రఖ్యాత రచయితల రచనలను ముద్రితరూపంలో సాహితీ బంధువుల కందించడం, సభలు సమావేశాలు జరిపి స్థానిక పౌరులలో సాహిత్యంపట్ల ఆసక్తి కల్గించడం ఈ ఉద్దేశాలతో గడచిన మూడు సంవత్సరాలనుండి యథాశక్తి కృషిచేస్తున్నది.

మా గ్రంథమాల సాహిత్యలోకంలో ఎత్తిన తొలిదివ్వె "జలపాతం" అనే కావ్య సంపుటి. ఇప్పుడు మీ కనులముందు జేగీయమానంగా కనుపడు తున్న "అజంతా సుందరి" రెండవ దీపకళిక. ఈ దివ్వెను వెలిగించడానికి మాగ్రంథమాల కార్యకర్త స్నేహశీలి కళాప్రియులునైన శ్రీ సోమవరపు రామమూర్తిగారి వితరణశీలమే కారణము. రామమూర్తిగారు తమ మాతృ దేవిస్మృతి చిహ్నంగా ఈ గ్రంథాన్ని ప్రచురింపించి యిందలి చిత్రములను స్వహస్తములతో చెక్కి తమ సాహిత్యాభిమానాన్ని ఈ రూపంలో ప్రక టించినందుకు హార్దికకృతజ్ఞతాభి వందనాలు. "అజంతా సుందరి"ని ప్రచు రించడానికి అంగీకరించి మాకు సహకరించిన మిత్రులు శ్రీ సి. నారా యణరెడ్డిగారికి మానమస్సులు. గ్రంథముద్రణలో యెల్లప్పుడుస హకరించే గ్రంథమాల కార్యకర్తలగు శ్రీ దుబ్బాక గోపాలాచార్యులు శ్రీ తోట నారాయణ శ్రీకాటూరం శ్రీరాములుగార్లకు వందనములు.

సముచితమైన సలహాలతో గ్రంథమాల పురోభివృద్ధికి తోడ్పడుతున్న మహాకవి శ్రీ దాశరథిగారికి కృతజ్ఞతాభివందనములు.

ఇట్లు,

**మడిపడిగ బలరామాచార్యులు**

కార్యదర్శి

అరుణశ్రీ గ్రంథమాల.

# కృతజ్ఞతలు

గత దశాబ్దంనుంచి సికింద్రాబాదులో సాహిత్యోద్యమ సంచాలకులుగావున్న బలరామాచార్యు, రామమూర్తి గోపాలాచార్యులాప్త మూడేళ్ళక్రితం 'అరుణశ్రీ గ్రంథమాల' స్థాపించి పుస్తక ప్రచురణమారంభించారు. గ్రంథమాల పక్షాన ప్రచురితమైన తొలిజాలునా 'జలపాతం' - సంవత్సరం గడచిందో లేదో 'బలరామూర్తు' లకు మళ్ళీ ఒక వచన ప్రవాహాన్ని ప్రచారం చేయాలనే ఆసక్తి కల్గింది. వీరిద్దరు స్వతహాగా చిత్రకారులూ శిల్పులూ కావడంవల్ల కళాకారుని జీవనాన్ని ప్రతిబింబించే కాల్పనిక ఇతి వృత్తంగల 'అజంతాసుందరి' ని ప్రచురించ సంకల్పించారు. 'అజంతా సుందరి' తో పాటు సుగాత్రి, ఋతువులరాణి అనే నాటికలను గూడ సంపుటీకరించి సహృదయుల కందిస్తున్నందుకు వీరికి నా కృతజ్ఞతలు.

ఈ చిన్ని పుస్తకాన్ని నా ఆప్త మిత్రులు రామమూర్తి మాతృమూర్తి స్మృత్యంకంగా సమర్పిస్తున్నాను. ఆర్థిక సహకారమిస్తున్న మిత్రులకు రచయితైన వాడు హార్దిక సహకారం తప్ప మరేమివ్వగల్గుతాడు ?

నారాయణరెడ్డి.



నా ఆప్తమిత్రుడు, కళాకారుడు

శ్రీ సోమవరం రామమూర్తి

మాతృదేవి స్మృత్యంకం

# అజంతా సుందరి

( సుత్తెమ్రోత దూరాన వినిపిస్తుంటుంది.
నేపథ్యంలో ఒక కంఠం నెమ్మదిగా పాడుతుంటుంది. )

నేపథ్యకంఠం :

సంసారకాసార
జంబాలమునుమీరి
హింసా విసంసార
హితజగమ్మునుగోరి
ఏకాంతమున అజం
తా కందరములందు
ఏపాపమంటని శి
లా ఫాలములయందు
ఎన్ని నాళ్లాయెనో
కన్నులను విప్పి
ఏ ఊర్వశిని విలో
కించేవు శిల్పి !

( సుత్తెమ్రోత క్రమంగా సన్నగిల్లుతుంది )

శిల్పి : [ పరిశ్రాంతుడై అర్ధనిద్రావస్థలో ]
అద్దాలవంటి శిల
అవ్యక్తముగదోచె
కనులలో మసక చీ
కటుల తరగలులేచె
నా అజంతాసీమ
నాకరూపముదాల్చె
నా శైలబాల ప్రా
ణము వోసికొని నిల్చె

భ్రాంతియో నాలోని
ప్రణయ సమ్మోహమో?
స్వప్నమో నాలోని
సౌందర్య దాహమో?

శైలబాల: [ అందెల చప్పుడుతో క్రిందికి దిగుతూ ]
రంభాది అప్సరో
బింబాధరలతోడ
జంభారి మౌళి సం
రంభించి యాడాడ
ఎవరో ననుమంత్రించి
భువికి రప్పించేరు
ఎవరో దేవతకు మా
నవత కల్పించేరు.

శిల్పి: [ ఉల్లాస సముల్లసితుడై ]
ఓ అజంతా సుందరీ
ఓ దిగంతమనోహరీ
నాలోని భావసం
ధ్యా కోటిమలమాపి
విందు పున్నమల నం
దించిన విభావరీ!
ఓ అజంతా సుందరీ
ఓ దిగంతమనోహరీ!
నీమేఖలాకింకి
ణీ మంజుల ధ్వనులు
నాశిలామయజీవ
నమునకుపసేచనలు
విలువెల్ల కనులతో
విన్నుచూచెదనన్న

సురనాథుడనుగాను
నరమాత్రుడనునేను.
మనసార నిన్ను వ
ర్ణన జేతునన్న; కవి
రాజునైననుగాను
రమణి! శిల్పినినేను.

శైలబాల :

శిలలో విమల చం
చలిని నిల్పిన శిల్పి
రాలలో నందన వ
నాలు నాటిన శిల్పి
సామాన్యుడవుగావు
సాక్షాద్విరించీ!
అర్చింతుమిమ్ము ని
త్యము శిరమువంచి

శిల్పి :

అర్చనలునాకేల
అప్సరోబాల!
నీ చరణ దాసుడను
గానచే వేల!
ఎన్ని యుగములు దాటె
నిన్నుగాంచగనెంచి
ఈనాడు రవళించె
నే; జీవన విపంచి
నాచేతిలోని ఉలి
నీ అందియల రవళి
కోసరముగాదటే
గుహాలి మ్రోగించినది.

ఓ చంద్రబింబాస్యా !
నాచేతికుంచె నీ
చిరునవ్వు కిరణాల
చిత్రించ నెంచినది.
ప్రాతశిలా ప్రతిమతో
భాషించి చూచితిని
ప్రతిభాషణము రాక
ప్రతిమనై పోయితిని
ఎటుచూచినా దివ్య
నటనాలయమ్ములే
కాని నూపురఝణ
త్కారాలు వినరావు
ఎందేగినా నాట్య
సుందరుల భంగిమలె
కాని యౌవన వికచ
కాంతులే కనరావు
నాకళలు నేటికి ప
రాకాష్ఠ జెందినవి.
నారాతి బ్రతుకు మం
దారాలు పూచినది
లేకున్న నీవంటి
నాకబిబ్బోకవతి
తొణకని మనోజ్ఞ యౌ
వన సుధాభాండమ్ము
మోసికొని ఏతెంచునా
నాగుండె
దోచుకొన నేతెంచునా

శైలబాల : [ భక్తిభావంతో ]
వమ్ము లాస్యదాస్యబంధ

నాలనుండి వికసించిన
నాకు శాశ్వతమైన క
ళాకాంతుల నందించిన
నాకు నవ్యజీవన దా
నముజేసిన ఆచార్యా!
దాసిజేయు పరిచర్యల
దయతో సెలవీవయ్యా!

శిల్పి :

దాసివటే నీవు మత్త
కాశిని: నాముందు
ఈవేళతనపు మాటల
కేనేమనియుందు.
అంబరగంగా ఫేనస
మన్వితమ్మౌ నీ దేహము
సంకల్పన మాత్రమ్మున
కందిపోవుగాదె చెలీ!
పరిచర్యల జేయుటకై
పరిభవించితివా దేవీ!
ప్రణయ పరీరంభణకై
జననమొందినావుగాని.
నీమృణాళ కోమలాంగు
ళీ మృదుల స్పర్శల నా
ప్రత్యంగము కిన్నెరలను
పలికించు విధానమోగు.
నీపరిలంబిత కుంతల
నీరదాల ముసుగుదీసి
నాటినవెన్నెలచూపులు
నాపాలిమరుని తూపులు.
సిగ్గుబరువుచేత ఏల

చెమరింపెదవో రాణీ!
కచఘాతముచేత నీవు
కంపించగవలెగాని.
తరళిత చేలాంచలమ్ము
సరిచేతునురావే
సడలినవేణీబంధం
ముడివేతునురావే

శైలబాల :

కళాదూరులైనవారు
ప్రలాపించు వచనమ్ములు
పూజ్యులైన మీరు పల్క-
బూనుటధర్మమ్మేనా?
విషయ సుఖమ్ముల కందని
విశ్వప్రేమ తపస్వులు
శిల్పాచార్యుల కింతటి
అల్పకామనలు తగునా?

శిల్పి :

సౌందర్యాన్వేషణలో
అంధుడనై పోయినాను
ఏదిధర్మమో పరిశీ
లించలేను చంచలాంగి!
ధర్మవిచారణలెందుకు
తరుణీ యీతరుణమ్మున
మర్మవేదనలు తీరును
మధుర పరిష్వంగమ్మున

శైలబాల :

చాలించుడు ఆచార్యా
సల్లాపములికనైనా

తన సృష్టిని మోహించే
తంత్రి గలదె యెందైనా?

శిల్పి :

నా సృష్టివానీవు
ఓ సుందరీమణీ!
ఆకసము దిగినట్టి
అమరకాంతవుగాని,
మదిచెదరిపోయెనే
మాటలాండగనిమ్ము
ఇదిగో నీజలుగు వ
య్యెదను కొటగనిమ్ము

( స్వప్నావస్థలోవున్న శిల్పిసంరంభంతో ముందుకువంగు తాడు. తలకు శిల బలంగా తగులుతుంది. కలకరిగి పోతుంది. అమరకాంత అదృశ్యమవుతుంది. )

మాయమైపోయెనా
నా అమరభామిని
శిలమాత్రమే విలిచె
విలపింతునేమని?
ఓ అజంతా సుందరీ
ఓ దిగంతమనోహరీ

( గొంతెత్తి పిలుస్తుంటాడు )

నేపథ్యకంఠం : కలలోన నీ శిల్పి
ఖండమే గంధర్వ
కాంతగా కనుపించెనన్నా !
మోహావి
భ్రాంతులను కల్గించెనన్నా !
విగ్రహములేకున్న
నీకళార్చన సున్న

సంయోగమేలేని
సౌందర్యమే మిన్న
సృష్టియే తనకు సం
తుష్టిని ప్రసాదించు
ప్రతిఫలము నాశించి
బ్రతుకడు కళాజీవి;
ఇది జగత్సత్యమోయన్నా !
మృదుకళా
హృదయమొకటే నిత్యమన్నా !

శిల్పి : [ పశ్చాత్తాపంతో ]
ఓ శిలాబాలికా
నాకళాదోలికా
అమలగిరి కంఠాల
అమ్లానమాలికా !
రాలలో గంధర్వ
రసజగత్తులునాటి
సందర్శనముతోడ
సంతృప్తి నందెదను
విశ్వసుందరతాగ
వేషణమ్మున కళను
కర్పూర కళికగా
అర్పణము చేసెదను
ఓ శిలాబాలికా
నాకళాదోలికా
అమలగిరి కంఠాల
అమ్లానమాలికా
ఓ శిలాబాలికా

---

2)

# సుగాత్రి

( తొలిరేయి ప్రియుడు తన్ను పల్కరించకపోగా నిరాశ నిహతయై మరలిపోతున్న ముగ్ధాంగన సుగాత్రి )

వాయుగానం :

హరిచాప సౌందర్య
గరిమ వెలవెలబార
నవరత్న ఖచిత భూ
షణకాంతి పెంపార ;
చండీశ్వరుని తపము
నుండి త్రిప్పగలేక
తిరిగిపోయెడు పార్వ
తి విధాన; మందాక్ష
భారావనమ్రమయై
పడతిముందుకు నడిచె
జాముదాటెనో లేదొ
శయ్యాగృహమువిడిచె

( చెలికత్తెలు సుగాత్రిని కలుసుకుంటారు )

చెలికత్తెలు :

ఏమె సుగాత్రి! భూ
మీదేవ పుత్రి
గడియలోనే ప్రియుని
గదివీడి వచ్చితివి?
ప్రణయతంత్రులు మ్రోయు
ప్రథమ సంగమవేళ
మదనుడు శరమ్ములకు
పదునుపెట్టెడు వేళ

మత్తిల్లిన నీప్రియము
'రిత్త శయ్య'కిత్తువటే ?

సుగాత్రి : ఏటికి చంపెదరునన్ను
మాటికి పెడమాటలతో
ముగ్ధురాలనై నాథుని
ముందు పల్కరించలేదు
రేపటి రాతిరిజామున
ప్రియవయస్యలారా !
కప్పింతును నాకాంతుని
కనులవలపుజూరా

దృశ్యం 2

(శాలీనుడు శయ్యామందిరంలో వుండగా సుగాత్రి ప్రవేశిస్తుంది)

సుగాత్రి : ఎలదంపతులు కౌగి
ళుల చిక్కువడురేయి
కలలునేత్రాంచల
మ్ములజారునడురేయి
ఏకాంతమును కోర
గా కారణమ్మేమి
ప్రియురాలిపైన ని
ర్దయమేలనో స్వామి ?
తాంబూలమీయవే
ఓంవాకరా యుంచు
పల్కవేలా స్వామి
కిన్కయానితిపేమి?
కిన్నరీ కంఠి మ్రో
గించవే రసగీతి
యంచు పల్కవదేల
చంచత్ ప్రణయలీల

పాదపద్మములు సం
వాహనముసేతునా
చేలాంచలమువీచి
గాలికల్పింతునా?

శాం.తి.మ.మ : [ నిర్లక్ష్యంగా ]
కమలపైనిద్ర ఉ
న్నపోలె యేతెంచె
ఏకాంత శయనమే
నాకు సుఖమనిపించె
భూషితాంగీ! కదలి
పొమ్ము నను వీడి
నను చేరబోకు తీ
యని మాటలాడి

సుగాత్రి : మీ చరణ సాన్నిధ్య
మే నాకు పదివేలు
గళమందు విమల మం
గళ సూత్రమది వాలు
తునిగిపోదే నాడు
మన ప్రేమ బంధమ్ము
నా పైన కిన్కబూ
నగలేరు సతతమ్ము.
శారదాదేవి మ
హోదారవీక్షణము
మీకాయురభివృద్ధి
చేకూర్చు ననుదినము.
నా పైన నేనాడు
మీపాదగతరేణు
వులు సోకునో యంచు
వేచియుండెద నేను.

దృ శ్యం 3

వాయుగానం :

తనకాంతపైన చి
త్తము మరల్చగలేక
ఇంటి వారలకు సం
తృప్తి కూర్చగలేక
కడకు కాంతాగృహము
విడిచి శాలీనుండు
ఊరివెలుపలతోట
లో నివాసమ్ముండు.

శాలీనుడు : [ తోటలో పనిచేస్తూ ]
ఎంత మనోహర మీఉద్యానము
ఎంత చిత్రమీ వాతావరణము
చంచల మృదు పక్షాంచలములతో
సంచారించెడు చంచరీకములు
సుందర సుమ మకరందధారల మి
ళిందములకు నిత్యాభిషేకములు.
ఎంత మనోహర మీఉద్యానము.
ఎంత చిత్రమీ వాతావరణము.
చెంగలువల్వ, గేదంగులు, లుంగల
వంగమ్ములు, కురవక చంపకములు
పాటల వకుళజపా సుమవల్లులు
మల్లెలు మొల్లలు కొల్లలు కొల్లలు
సహజశోభితోద్యానముండగా
మంజు లతా సీమంతిను లుండగ
నందన వనమేలా బృందారక
సుందరదనలేలా ?

నాయకుగానం :

ఆకాశమంత మే
ఘావృతమైపోయె
నలుదెసల గర్జావి
నాదాలు మింరేగె
జోరున మహావర్ష
ధారాప్రపాతము
కురియుచుండ సుగాత్రి
వచునికడ కదలెంచె

నాగసుమి : [ సుగాత్రిరాకను గమనించి సాభిప్రాయంగా ]
సహజసౌందర్య మా
హ్లాదనమ్మొనరించు
స్వర్ణరజతాది భూ
షణములను ధరియించు
కాంతలకు; ఈ పూల
ఘనత చేకూరునా
వెలలేని ఈ పూల
వలపు చేకూరునా

సుగాత్రి : [ అభిమానంతో కుంచించుకపోయి ]
నామనోహరుని మా
నసమునైవగలేని
ఈ భూషణములేల
ఈయలంకృతులేల?
త్రుంచివేతును వీని
తో నాకుపనిలేమి
తోటపనిలోఁ ప్రియుని
తోమండగాలేమి.

( నగలు పారవేసి పూలమొక్కలకు నీళ్ళు కడుతుంటుంది )

కాలీనుడు : [ ఆమె సహజసౌందర్యానికి సమ్మోగ్ధుడై ]
నగలు పారవైచి పేద
నడుమున పయ్యెద బిగించి;
బిగిచనవ అటునిటు కం
పింపగ నడకసాగించి;
నీలజలధరా వగుంఠ
నాయజాటి వెలివచ్చిన
పూర్ణచంద్రబింబమువలె
పొలతిమిన్న కన్పించెను
పులుగడిగిన ముత్యమై అ
పూర్వకాంతి సారించెను
( సుగాత్రి వైపు అడుగేస్తూ )
అడుసుతుంపరలు చెక్కిలి
యద్దమ్ములపై చిందెను
ఉత్తరీయమున తుడిచెద
ఉన్మదగజయానా,
వానజల్లులోన తడిసి
మేనుతీవె కంపించెను
వెచ్చదనము కల్పించెద
బిగికౌగిలిలోన.
తొగ కన్నుల జవరాలా
తోటపనులు నీకేలా ?
ఎంత అలసినావో విశ్ర
మింత మీనికుంజాల
( సుగాత్రిని కౌగిలించు కుంటాడు )

సుగాత్రి :

ఈ నాటికి కరుణగల్గె
ప్రాణేశ్వర నాపైన;

రసహృదయమ్మెందు నొక
రాతిబొమ్మలో నైన.
గడచిన వత్సరమునన్ను
కాలియపెట్టితివేలా ?
కలలోపలనైన నన్ను
పలుకరించవేలేలా?

శాలినుడు :

చందురులోని కళంకము
చందమ్మౌన సుందరాంగి :
నీవు దాల్చినట్టి నగలు
నీ అందానికి ముసుగులు.
నగలను దిగవిడినంత
నవలావణ్యముపొంగెను
నాలోపలి ప్రణయవాంఛ
నేలదాటి యుప్పొంగెను.

సుగాత్రి :

అటులైన మీఆశ
యమున విర్వర్తింతు
కృతక భూషలను శా
శ్వతముగా వర్జింతు
తలిదండ్రులేల మి
ద్దెలు మేడలేలా
పతికోరలేని నం
పదలు నాకేలా ?

శాలినుడు : [ సుగాత్రి కురులను చేతితో దువ్వుతూ ]
ప్రకృతి లక్ష్మిశిరో
మకుటాయమానమ్ము
మంజులోద్యానమే

మననిత్యనిలయమ్ము,
కాముకులు పఠియింప
గాలేని కావ్యమ్ము
సహజసౌందర్యమే
సర్వదా సేవ్యమ్ము.
నీవపర శారదవు;
నేనునిత్యము పుష్ప
లోకాలసృష్టించి
నీకు పూజలుసేతు.
నిజమైన సుందరివి
నీవే సుగాత్రీ!
నీచరిత మమరమై
నిల్చునీ ధాత్రి

---

( పింగళి సూరన కళాపూర్ణోదయ కావ్యంలోని సుగాత్రీ శాలీనుల కథ ఆధారంగా )

# ఋతువుల రాణి

బృందగీతి :

మధుమాసం మధుమాసం
మృదుకుసుమాల పెదవులపై
విమరలేచు దరహాసం
మధుమాసం మధుమాసం
శిశిరదగ్ధ లతావళికి
పుష్పాంబర విన్యాసం
చివికిన నరహృదయాలకు
నవయౌవన సందేశం
మధుమాసం మధుమాసం

మాధవుడు :

ఓహోహో, ఓహోహో,
సుందర వాసంతరాణీ
శోభలనభివర్ణించి
బృందగీతి నాలో మక
రందరసము నందించెను.
ఓ వసంత భామినీ
ఓ విలాస గామినీ
రావే నానీల నిశా
జీవిత సౌదామనీ,
ఓహోహో, ఓహోహో,

బృందగీతి :

మధుమాసం మధుమాసం

మాధవుడు :

జుమ్మను రాగమ్ములు విర
జిమ్మవేల తుమ్మెదలు?

పంచదార గొంతులు పలి
కించవేల కోకిలలు ?
మావిపై వి క్రొందేనియ
మాటమీటదేలా?
ఏదినావసంతరాణి
ఇంతవరకు రాదేలా ?

దృశ్యం 2.

ఋతువులరాణి : ఆకువన్నియ జిలుగు
కోక సవరించి
కొప్పులో మందార
కుసుమాలు ముడిచి
పండు మోమగుపూల
దండలల్లే వరకు
ఇంతవేళాయె ప్రియు
డెంతగావేచెనో ?
ఎదురుతెన్నులు జూచి
ఎంతగా వగచెనో ?
ఓ నాప్రియసఖా !
ఓ చైత్ర రథికా !
నీ కమలవర్తింప
నీ మ్రోలనర్తింప
నీలో ప్రణయ కింకి
ణీ నాదములు నింప
కానలను కోనలను
గడచి వస్తున్నాను
కరివోని తారుణ్య
భరము మోస్తున్నాను
ఓ నాప్రియసఖా !
ఓ చైత్రరథికా !

శిశిరుడు : [ గబగబ ప్రవేశించి ఋతువులరాణిని చూచి ]
కొలనులోని అం
దలా
మొయిలులోని మిం
చులా
అయారె ! ఒయార
మవర్ణనీయం
వసంతలతాంగి
వరాలప్రాయం
( ఆమె కెదురుగా నిలుస్తాడు )

ఋతువులరాణి :
ఆకురాలిన వృక్ష
మటులున్న తనువుతో
ఈదల విభావ పా
రాదేటి జడలతో
ఎవరవయ్యా నీవు
ఎదురుగా నిల్చేవు
చేదు చూపులతో యె
గాదిగా చూచేవు

శిశిరుడు :
ఎవరని ననుప్రశ్నించేవా?
ఎన్నడు శిశిరుని కనలేదా ?
ఇన్నాళ్ళుగ హేమంతవయస్విని
కన్నులెదుట వర్తించి
వలిపమ్ములు దిగలాగి వృక్షకాం
తలను నగ్నమొనరించి;
నీ యధరాంచలపీయూషమ్ముకై
నిలిచితినో కలవాణీ !

నీనులివెచ్చని కౌగిలిలో బం
దీ నౌదును అలివేణీ!

ఋతువులరాణి :

అన్నన్నా ! ఎంతమాట
లాడినావు శిశిరా !
వినలేకున్నాను నీవు
విషవాక్యాలు విసర
మాధవుడే నాజీవిత
మార్గాంతర సహగామి
ఋతురాజే నాయెదలో
అతికిన భాగస్వామి
అన్యులకీ ప్రేమ పాత్ర
వందించగలేను
తొలగిపొమ్మ విముషమ్మిట
నిలువజాలలేను

( వికటంగా నవ్వి ముందుకునడుస్తూ )

శిశిరుడు :

జడిసెదేల బేలా! వా
ల్జడపువ్వులుజారె
కోపంతో నీవదనం
గులాబీగమారె.
దాటలేవు నాఘన హ
స్తాల పంజరాల
ఈ విశీధి నాతోనే
ఊగుము సుఖడోల

ఋతుపూలరాణి : [ నిస్సహాయస్థితిలో ]
ఓ సమీరణా! నీవై
నా సహాయమవవయ్యా
ఋతురాజుకు నా విషాద
గతివిచెప్పి రావయ్యా
( గాలివేగంగా వీస్తుంది )

మాఘ ప్రభు : [ దూరంనుంచి ]
ఓ వసంతకామినీ
ఓ దిగంతకామినీ
ఏంమన్నావే మరాళ
మందమందగామినీ !

ఋతుపూలరాణి :
శిశిరహస్తాలలో
చిక్కిపడియున్నాను
అసహాయురాలనై
అలమటిస్తున్నాను
గడియలో బ్రతుకు పం
కమ్ములో దిగునయ్య
తడవుసేయకవచ్చి
విడిపించి పోవయ్య !

మాధవుడు :
నీ కొరకు పక్షుల
పైకదలివస్తాము
శిశిరహస్తాల చే
దించి విడిపిస్తాము
ఇదొగోనె వచ్చితిని
బెదురేల ప్రేయసీ ?

అనలవృష్టికి శిశిరు
డవుతాడు నుసినుసి
( శిశిరుణ్ణి సమీపిస్తూ )
శిశిరుడా! నీయాట
చెల్లబోదిక పైన
అగ్నిబాణాలు సం
ధించితిని హస్తాన

శిశిరుడు : [ ఋతువులరాణిని విడిచి పారిపోతాడు ]

ఋతువులరాణి
మాధవా! శిశిరుండి
దోదూరమైనాడు
భయసంభ్రమాలతో
పారిపోతున్నాడు
వెన్నుజూపినవాని
వెంటాడబోకండి!
అగ్నిబాణామలన్ను
హాసమందించండి

మాధవుడు : [ ఋతువులరాణిని చేరదీస్తూ ]
ప్రతిపదాన రసవీణలు
పలికించే మధుబాలా
ప్రతిదృగంచలాన వలపు
ప్రసరించే జవరాలా!
పూలచేల మొకసారిగ
కేలనంటుదునురావే
నీలికళ్ళలోని రహ
స్యాలు చూచెదనురావే

ఋతువులరాణి : [ మాధవుని కౌగిలిస్తూ ]
నీతో చిరకాలము రా

జీవితవసంతతేజా !
నీమువలో నామొదనం
పంచుము ఋతురాజా

మాధవప్రియ :

ఓ వసంతకామినీ
ఓ విలాసగామినీ
నీవే నాకిలవిశా
జీవిత సౌదామనీ !

బృందగీతి :

మధుమాసం మధుమాసం
యుగయుగాలు తీరినా
జగతియెంత మారినా
సర్వఋతువులల్లో వా
సంతకాలమె విశేషం
మధుమాసం
మధుమాసం

---

శివాజీ ప్రెస్, సికింద్రాబాదు.



# అరుణశ్రీ గ్రంథమాల

1870/1, జనరల్ బజారు, సికింద్రాబాదు.

---

నారాయణరెడ్డి గారి రచనలు :

| | | |
|---|---|---|
| జలపాతం | .... | రు 1 0 0 |
| నవ్వని పువ్వు | .... | 0 10 0 |
| విశ్వగీతి | .... | 0 6 0 |
| అజంతాసుందరి | .... | |